# నా
# విదేశపర్యటన అనుభవాలు






ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# డా॥ కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ కనకాభిషేక సమయమున సమర్పించు సుమాంజలి!

అనంతపురమందలి, లలితకళా పరిషత్తు వారిచే ఏప్రిల్ 10 వ తేదీ 1988 వ వర్షమున డా॥ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారికి జరుపబడిన కనకాభిషేక సందర్భమున సభ్యమహాశయులకు అర్పించుకొనిన చిరుకానుక.

ఊ. లక్ష్మీకాన్తమ్మ.

# నా
# విదేశపర్యటన అనుభవాలు






ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# ముందుమాట

సాంస్కృతిక వినిమయశాఖ వారి ప్రణాళిక ననుస రించి మన భారత ప్రభుత్వం నన్ను రష్యా, తూర్పుజర్మనీ, జెకోస్లోవేకియా, అమెరికా దేశాల పర్యటనకు పంపినపుడు, అక్కడి నా అనుభవాలను, ముఖ్యంగా ఆధ్యాత్మికపరమైన అనుభవాలనుగూర్చి నేను వ్రాసిన ఆంధ్రప్రభ దినపత్రిక లోని నా వ్యాసాలను సోదరులు శ్రీ గొల్లాపిన్ని రామచంద్ర శాస్త్రిగారును, శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారును పుస్తక రూపంలో ప్రచురించడానికి పూనుకోవడం చాలా ముదావ హం. ఇదివరలో ఈ ప్రయత్నాన్ని సాధించిన శ్రీ శాస్త్రి సోదరులకును, ప్రచురణకుపూని ముద్రణ వ్యయమును భరించుటకు ముందుకువచ్చిన శ్రీ గుంజపల్లి జి. లక్ష్మిరెడ్డిగారికి నా ధన్యవాదాలు.

ఆముద్రణ ననుసరించి యిప్పుడు మఱల రెండవ ముదణను పూనుకొంటూ ఉన్నానని తెల్పుటకు సంతసించు చున్నాను.

ఇదే ప్రణాళికలో విదేశపర్యటనము చేసి వచ్చిన ఇతర సోదరులు చాలామంది తమ అనుభవాలను పత్రికలలో ప్రచురించియున్నారని నేను వినుటయేగాని, ఆ వ్యాసాలను చూచే అవకాశం నాకు లభించలేదు.

మన భారతదేశం, పౌరాణికంగానేకాక, చారిత్రకంగా కూడా ఒకప్పుడు విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక, పారిశ్రామిక, వాణిజ్య, కళాదికమైన సమస్తరంగములలోనూ చెప్పనలవికానంత ఔన్నత్యాన్ని సాధించియుండడమేకాక, విశాల వసుంధరలో అద్వితీయమైన, అఖండమైన, ఐశ్వర్య ప్రాభవాలుకల, మహోజ్వల నాగరికతలుకల, ప్రతిభావంతమైన మహిమగల దేశంగా, అఖండకీర్తి ప్రతిష్ఠల కాలవాలమైన సంపన్నదేశంగా కీర్తింపబడిన విషయం సత్యదూరంకానిది!

ఆనాటి భారతదేశంలోని తక్షశిల, సాంచీ విద్యాలయాలకు ప్రపంచంలోని ఐశ్వర్యవంతములైన, మహోన్నత నాగరికతాప్రాభవాలుకల, గ్రీకు మొదలగు అన్ని దేశముల నుండీ విద్యార్థులు, విద్యార్జనకొరకు వచ్చేవారనేది చారిత్రక

సత్యం! అంతేగాక భారతదేశంలోని బజారు అంగళ్ళలో రాసులుగా పోసిన రత్నజాతులను చూచి నివ్వెర చెంది, తమ చరిత్రలలో భారతదేశాన్ని వసుంధరామతల్లికే తలమానికంగా వర్ణించిన మెగస్తనీసు మున్నగు విదేశరాయబారుల ఉల్లేఖనాలు ఈ సీమ భాగ్యోన్నతికి ప్రత్యక్ష సాక్ష్యాలుగా ఉన్నాయి.

అట్టి మన భారతదేశం నేడు పైన వర్ణించిన స్థితికి పూర్తివ్యతిరేకంగా తయారుకావడమేకాక, నేడు పాశ్చాత్య దేశాలు వైభవసంపన్నములై, మన ఊహలలో - అందని అందాలసౌధాలుగా, అమరభూములుగా ఆకృతినొందియుండడంకూడా మనము ముఖ్యంగా గమనించవలసిన ప్రధానాంశం.

కొట్టవచ్చినట్లు కనబడుతున్న ఈ వైపరీత్యస్థితియే నన్ను, ప్రభుత్వంవారి పిలుపు రాగానే, విదేశగమనానికి అత్యంతం ప్రోత్సహించింది.

నిస్సందేహంగా పాశ్చాత్యదేశాలన్నీ వర్తమాన కాలంలో, చాలా ఐశ్వర్యంతో మహోజ్వలంగా వెలిగిపోతున్న దేశాలే. ఆకాశం అంటే అక్కడి సౌధరాజాల ఆధారంగా పైకి, పైకి, మరింత పైకి ప్రాకి, అందలమెక్కి నింగికెగప్రాకి, నిక్కి చూస్తున్న, అనూహ్యమైన వారి ఐశ్వర్యమూ, దానికి తగిన ఆ పౌరజీవితములో వెల్లివిరిసే మధురాతి మధురమైన, అత్యుచ్ఛస్థితికి చెందిన అనుభవపరంపరా చూస్తూంటే నిజంగా ఎంత ఆనందం కల్గిందో చెప్పలేను–వర్ణించలేను! వారు అఖండమైన ఐశ్వర్యంతో ప్రకృతిపై అక్షరాలా ప్రభుత నెఱపుతూ ఉన్నారంటే అతిశయోక్తికాదు.

తీర్చిదిద్దిన వారి నగరనిర్మాణపద్ధతీ, అతివిశాలమైన, నగరంలోని, దేశంలోని, అన్ని వీధులకు, అన్నిగ్రామసీమలకూ 60, 70, 80 మైళ్ళ వేగంతో పరుగెత్తగల మోటారు వాహనాల గతిశీఘ్రతకు అనువైన, విశాలమైన బాటలేమీ, విద్యా, వైద్య, పారిశ్రామిక, వాణిజ్య, ఆరోగ్యసౌకర్యాల ఏర్పాట్లేమీ, గొప్ప గొప్ప యూనివర్సిటీలు, మ్యూజియములూ, లైబ్రరీలు, హోటళ్ళు, రైల్వే, విమానయానగృ

హాలూ, భూగర్భ రైల్వేదారులేమి, నర్సరీ, కిండర్‌గార్డెను స్కూళ్ళూ, మహిళా సంఘాల ఏర్పాట్లేమి, అన్నింటికీ మించిన, వారి క్రమశిక్షణాయుతమైన పౌరజీవనవిధాన మేమి, ఒకటనేల! "అచట కల్గిన చిన్న సంపదయిన చేవ" అని నిరాఘాటంగా చెప్పవచ్చును.

అన్నింటికంటే ఆ పాశ్చాత్యుల ఐకమత్యము, క్రమశిక్షణా, సంఘస్పృహా, దేశభక్తి, సేవాతత్పరత, జాతీయ భావసంపద, దేశాభివృద్ధి కార్యక్రమాలపట్ల కల దీక్షాతత్పరత, ఇప్పటి మన భారతదేశీయులకు నిజంగా ఆదర్శప్రాయంగా ఆరాధనాభావంతో అభ్యసించవలసిన ప్రధానాంశాలు!

ఇవన్నీచూచి నేనెంతగా ముగ్ధురాలనైనానో, అంతగా మన దేశముయొక్క ప్రస్తుతదుస్థితి తలంచి పరితపించిపోయానుకూడా.

ఇవన్నీ నా సోదరయాత్రికులు ఎన్నో విధాలుగా పత్రికలలో వ్రాసినారని నేను విన్నాను.

ఐతే రష్యాలోని రాజకీయపరమైన గూఢతంత్ర విధానమూ ఆ సోషలిస్టు దేశంలోకూడా ఇపుడిపుడే పొటమరిస్తూన్న విధినిర్వహణమాంద్యమూ, అలసతనమూ; వాణిజ్యపరమైన సుస్థిరతకూ, పరాకాష్ఠకు చెందిన అత్యున్నత స్థితికి దోహదమిచ్చే అమెరికాలోని నీతి నిజాయితీకల వాణిజ్య విధానమూ (Trade Honesty). అక్కడే అదే రంగంలో ఇపుడిపుడే తల యెత్తుతూన్న మోసగింపు విధానమూ (Cheeting) కూడా నాకు ఆశ్చర్యాన్ని కల్గించక పోలేదు. ఏమైనా ఇప్పటికీ భారతీయుల ఆధ్యాత్మిక విధానం పట్ల వారికిగల పూజ్య భావమూ, ఆదరణా నన్ను ఆశ్చర్య చకితురాలిని చేసివేశాయి.

ఐశ్వర్యంలో పరాకాషస్థితి నందుకొన్న ఒక దేశం యొక్క ఆంతరంగికమైన అంతస్సత్వమనే కెరటం విరిగిపడి. మరల నిజతత్వాన్ని వెదుకుకోవడం కోసం అరాటపడుతుందనీ, ఆ తపన యొక్క తీవ్రత, అంతస్థులు దాటేవరకూ ఆ జాతి నిదురించదనీ–అదే విజ్ఞాన జీవియైన మానవుని పరమాశయ

మనీ ఈ సత్యాన్వేషణలో ఇప్పుడు పాశ్చాత్యులు తదేకలగ్న మనస్కులైనారనీ నేను అక్కడ ఉన్నప్పుడు గ్రహించాను.

అయితే మన భారతదేశంలో ఈ అన్వేషణ క్రొత్తది కాదు. ఆ తపస్యావిధానంలో ఇతరులు మనకు నేర్పవల సిందేమీ లేదు.

అయినా (కారణాలు వెదుకకుండా) మనం ఇప్పుడు రెంటికీ చెడిన రేవడులమైనాము. పైపెచ్చు మన జీవితంతో మనకు నిత్యపోరాటం! మన అలవాట్లకు మనకు కుస్తీపట్లు!! మనలో మనకు అవిశ్వాసం!! పరస్పరం దగా ప్రవర్తన– దంభం, మోసం, లంచగొండితనం, అవిద్య. అన్యప్రీతా రణం, అనైకమత్యం. ఎదుటివారి పొట్టలు కొట్టడం, తలలు కొట్టడం, అదేమంటే, వీటన్నిటికీ మన దరిద్రమే కారణ మని దబాయించడం! ఇవి ముఖ్యంగా ప్రస్తుత మన జీవిత ప్రతిబింబాలు! మనం ఏహ్యమైన ఒక బరువును బ్రదుకుగా లాగుతున్నాము.

మఱి సంపూర్ణ ఐహిక జీవన పరిధులు ముట్టిన ఆ పాశ్చాత్యులే, నిర్మలమైన, సుందరమైన, ప్రశాంతమైన, నిత్యమైన, నిశ్చలమైన, నిరుపద్రవమైన మన ఆధ్యాత్మిక జీవనసరళికి దాసోహమ్మంటూంటే. ఆ జీవితానికి ప్రాత కావులమైన మనమెందుకు ఈ అసత్య, దాంభిక, మాయా. పాశవిక జీవితాన్ని ఇష్టపడి స్వీకరిస్తూ ఉన్నాము? "అసతో మా సద్గమయ," "తమసో మా జ్యోతిర్గమయ." "ఆయాం తు నో భద్రాణి సర్వతః," "మా విద్విషావహై," "సర్వే జనా స్సుఖినో భవంతు," అనే మన శాంతి కాముకత, కల్యాణ కామన మంగళా కాంక్ష, ఏ మైనట్లు?

వాళ్ళనుచూచి, యిప్పటికైనా, మన ఆధ్యాత్మిక జీవిత సౌందర్య వైభవామూల్య స్థితిని తెలుసుకోగల్గడానికి, ప్రయత్నించి, మరల మన ఈ ఆధునిక విజ్ఞాన సంస్కా రంతో ఆ పూర్వపు ఉన్నతస్థితిని పొందగలమా? అనే జిజ్ఞా సను మన భారతీయులలో రేకెత్తించడానికై నేను ఈ

వ్యాపాలలో పాశ్చాత్యదేశీయులు జోహార్లర్పించిన మన ఈ అద్భుతాధ్యాత్మిక సందర్భమైన విషయాలు మాత్రమే వ్రాశాను. ఈ నా ప్రయత్నం ఏమాత్రం నెఱవేరినా నేను నా ప్రయత్నంలో కృత కృత్యురాల నైనట్లే.

బాపట్ల
29-5-1980

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# మనవి.

మనది సనాతనమతము. అంటే-ఫలానా శకం ఫలానా సంవత్సరము ప్రారంభమయిన దనడానికి వీ లేనంత ప్రాచీనతము.

ఇది హిందూమతం.

ఈమతస్థులు మతోమతాన్ని దూషించరు. ఇతర మతాలవారిని ఇందులో చేరమని ప్రచారంచేయరు. బల వంతపెట్టరు. జీతభత్యాలు ఎఱచూపరు. ఇతరవిధాలైన ఆకర్షణలకు, ప్రలోభాలకు గురిచేయరు.

అయినా హిందూమతం ఎదుర్కొన్నన్ని ఆపదలు కష్టనష్టాలు అన్నీ యిన్నీ కావు. హిందువుల-గొంతుపైన కత్తిపెట్టి-హింసించి-గోమాంసం తినిపించి-ఇతర విధాలుగా ప్రలోభపెట్టి ఇతరమతాలవారు తమమతంలో కలుపు కొన్నారు.

# II

ఇతరదేశాలవారి కోట్లకొలది డబ్బు-ప్రభుత్వంవారి పలుకుబడి-ఇందుకు మరింత దోహదం చేసింది.

అయినా హిందూమతం నశించలేదు!

హిందూమతానుయాయులు ఇతర మతాలలో చేరి పోవడానికి ఒక ముఖ్యకారణం-హిందువులు తమలో కొందరిని నిర్దాక్షిణ్యంగా, అంటరానివారిగా, నీచంగా చూడడం.

ఇక దారిద్ర్యం. అజ్ఞానం లాంటివి మరికొన్ని చాలా ముఖ్యకారణాలు కలసివచ్చినవి.

విగ్రహారాధన తప్పని ప్రచారంచేసే మతాలవారిలో చాలామంది విగ్రహారాధకులే.

క్రిస్టియన్సులో కాథలిక్సు మేరీమాతను ఆరాధిస్తారు. మేరీమాతకు గుళ్ళు గోపురాలున్నవి. ఆమెకు మొక్కుబళ్ళు చెల్లిస్తారు.

# III

అలాగే హిందువుల్లో విగ్రహారాధకులూ వున్నారు. ఏకేశ్వరోపాసకులూ వున్నారు. యోగమార్గంలో జ్ఞాన మార్గంలో పరమేశ్వరారాధన చేసేవారూవున్నారు.

కానీ క్రైస్తవులు హిందువులను విగ్రహారాధకులని తమపత్రికల్లో-కరపత్రాల్లో ఈసడిస్తూనేవున్నారు.

ముస్లిములలో హాజీయాత్రకు వెళ్ళేవారు "కాలాపత్థర్"ను దర్శించి చుంబిస్తారు.

శ్రీశైలం వెళ్లేయాత్రికులు శ్రీ మల్లికార్జున లింగాన్ని ఫాలతలంతో స్పృశిస్తారు. ఈ మతసామ్యాన్ని గౌరవించడం మానవజాతి ధర్మంకాదా!

మతములను అధ్యయనంచేసి-ఆలోచనచేసి, విలువలుకట్టి, ఎక్కువ తక్కువలు నిర్ణయించి- ఇతర మతాలలో చేరిన హిందువులు కానరారు.

ఇతరమతాలలోని ఆలోచనాపరులు జిజ్ఞాసువులు ఆశలకు ప్రలోభాలకు దాసులు గానివారు-హిందూమతంలో

# IV

చేరినవారున్నారు. Dr. ఆనిబిసెంటు, సిస్టర్ నివేదిత. లెడ్‌బీటరు. మాడమ్ బ్లావెట్‌స్కీ మొదలయిన మేధావులు-మాక్స్ ముల్లర్‌లాంటి మహనీయులెందరో హైందవవేదాంతాన్ని అనుసరించినారు.

డబ్బు కక్కుర్తిగాని-సాంఘిక దురాచారాలకు బలి అయికానీ-వీరు హైందవమతాన్నీ సంస్కృతినీ మెచ్చుకొన్న వారుకాదుకదా!

శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు తమవిదేశ పర్యటనలో - అల్పవ్యవధిలో తాము దర్శించిన - వైదిక సంస్కృతి వికాసాన్ని విజ్ఞాత్రింగా మనకు తెల్పినారు.

ఆమె గొప్ప విదుషీమణి. సంస్కృత కవయిత్రి. జాపక్ష మహిళాకళాశాలా ప్రిన్సిపాలు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఎగ్జిక్యూటివ్ సభ్యురాలు. పెక్కు సాహిత్య సంస్థలతో సంబంధముగలది. అనేక గ్రంధములను వెలయించిన రచయిత్రి, గృహలక్ష్మి కంకణ విజేతయేకాదు. మణెన్నియెా సమర్థ సమ్మానములందుకొన్న సాహిత్య

సరస్వతి యీామె. "జాతిపిత" వంటి అముద్రిత రచనలు పెక్కులు. వీణానాదనము - ఉపన్యాసములు - దేశాటన సంఘసేవ వీరి అభిరుచులు.

గొప్ప సంఘసంస్కర్త-దేశభక్తులు-మధురకవి శ్రీ నాళం కృష్ణారావుగారు వీరిజనకులు, తల్లి శ్రీమతి సుశీలమ్మ గొప్ప సంగీతాభిమాని. వీరి భర్త శ్రీ హయగ్రీవగుప్తగారు గొప్ప సంస్కృత భాషాభిమాని.

1972లో భారతప్రభుత్వం వీరిని సాంస్కృతిక పర్యటనకై రష్యా, జర్మనీ, జెకొస్లొవేకియా, అమెరికా, కెనడా మొదలయిన దేశాలకు పంపింది. భారతీయసంస్కృతి ఇతరదేశాలలో ఎలా గౌరవింపబడుతూందో-ఆమె-ఆంధ్ర ప్రభ దినపత్రికలో వ్యాసాలను ప్రకటించింది.

అవి విజ్ఞానదాయకంగానూ; తమ మతాలలో వుండే అసంఖ్యాక భేధాలను కప్పిపుచ్చి-హిందూమతం అంతా విభేదాలతో కూడుకొనివుందని అసత్యప్రచారం చేసేవారిని

జయలుపరచేవిధంగానూ వుండడంవల్ల ఈవ్యాసాలను ప్రచురించి ప్రచారం చేయాలనే సంకల్పం నాకు కల్గింది.

అనుమతికోసమై కోరగా వెంటనే అంగీకరించిన శ్రీమతి ఊటుకూరువారికి నా కృతజ్ఞతాంజలి.

చదువుకొన్న కొందటిలో కొందరైనా భారతీయ సంస్కృతిని–శ్రీమతి ఊటుకూరివారి ఆశయాన్ని అవగాహన చేసుకుంటే యీ ప్రయిత్నం సఫలతగాంచినట్లే.

తాడిపత్రి  
30-6-77

విధేయుడు,  
గొల్లాపిన్ని రామచంద్రశాస్త్రి

భారత ప్రభుత్వంవారు సాంస్కృతిక పర్యటన కార్య క్రమంలో నన్ను ఒక యాత్రికురాలుగా ఎంచుకొన్నట్లు తెల్పుతూ వ్రాసిన జాబు 1972 జూను 1వ తేదీనాడు నాకు చేరిన తరుణంలో ఒక్క నిముషంపాటు ఆశ్చర్యంతో నిశ్చేష్టురాలను కావడమేకాదు— ఇంగ్లీషు సరిగా మాట్లాడడమైనా రాని నేను ఈ పర్యటనకు అంగీకరించడమా? మానడమా? అనే అంశాన్ని తేల్చుకోలేకకూడా చాలా కలగుండుపడ్డాను.

కాని ఉత్తరక్షణంలోనే ఒక విస్పష్టమైన భగవదాదేశం స్థిరసౌదామినివలె నాలో భాసించి, విదేశపర్యటనకు నన్నంగీకరింప జేసింది. ఆ క్షణం ఎంతో పవిత్రమైనదనీ, ఆనాటి ఆ నా నిర్ణయం ప్రయోజనకరమైనదనీ నేను జీవితాంతం భావింపవలసిన శుభతరుణమది!

ఎందువల్లనంటే, యుగయుగాలనుండి విశ్వజీవన స్రవంతికే ధర్మచైతన్యరససవాహిలను ప్రవహింపజేసి, తదవగాహనచే శుచిస్మితమైన సృష్టి జీవరాశికి రుచిరాదర్శ

ములను మండనాయమానముగా నొసంగజాలిన భారతదేశ సభ్యత ఈనాడు మిక్కిలి అగ్నిపరీక్షకు లోనైనది. అంతే కాదు. పరదేశధర్మావలంబనవ్యామోహముచేత మిక్కిలి కలుషితమై పతనావస్థలోనుండి, శీర్ణమై, జీర్ణమై, దురపిల్లు చున్నది.

భారతీయులెవరిని జూచినను, అభారతీయకర్మ ధర్మ సంస్కార దోషము వారి మొగముల తాండవించుచు, ఆసన్న భవిష్యత్తునందు, ఆర్షమైన ఈ పావనభారతీయసంస్కృతికి ప్రాప్తించనున్న దురవస్థ కన్నులగట్టుచున్నది.

అట్టియెడ, మనలను సర్వనాశనంచేసిన, ఈ విదేశ ముల యందలి ఆచారవ్యవహారాలెట్టివో, వారికి మన భార తీయ సంస్కృతిపై గల ఉద్దేశాలెట్టివో తెలుసుకో వలెననే నా చిరకాలాభిప్రాయానికి ఆనాడు ఒక పరిష్కారరూపంగా ఆ పర్యటన నాకు పరమేశ్వరుడు ప్రాప్తింపచేసినాడనే ఒక తృప్తభావం నాలో ఒక క్షణకాలం తళుక్కున తళ్కొత్తి మెర సింది. ఆ ఉద్దేశంతోనే నేను ఆ పర్యటన కంగీకరించాను.

# 3

సరే, అనుకొన్న కార్యక్రమం ప్రకారం 1972 ఆగస్టు 13 వ తేది భారతకాలమానం ప్రకారం ఉదయం 9 గంట లకు ఢిల్లీ పాలం విమానాశ్రయంలో విమానం అధిరోహించి మాస్కో మీదుగా తూర్పు జర్మనీ రాజధానిగరమైన బెర్లినుకు, జర్మనీ కాలమానం ప్రకారం రాత్రి 8 గంటలకు చేరుకొన్నాను.

మన రాయబారకార్యాలయంనుండి శ్రీ దేశికర్, జర్మనీ ప్రభుత్వమునుండి కుమారి ఖ్యీల్ నాకు స్వాగతం చెప్పడాని బెర్లిన్ విమానాశ్రయానికి వచ్చారు. విమానాశ్ర యంనుండి నన్ను 37 అంతస్థుల హోటలుకు తీసుకొని వెళ్ళారు. ఆ హోటల్‌లో 24 వ అంతస్థులో .7 వ నెంబరు రూము నా కియ్యబడింది.

మార్నాటి ఉదయం జర్మనీ ప్రభుత్వంవారి విద్యాశాఖ యందలి విదేశాంగశాఖాధికారి మిస్టర్ మట్యోవ్, వారి పర్సనల్ అసిస్టెంటు మిసెస్ ఆర్నాయిట్ నన్ను చూడడా నికి వచ్చి నేను చూడగోరే ప్రదేశా లేవో కనుగొన్నారు.

జర్మనీ సంస్కృతవిద్యాభ్యాసానికి పెట్టింది పేరనే విషయం మన భారతదేశంలో చాలావ్యాప్తిలో ఉండడం వలన నేను వారిని ప్రప్రథమముగా కోరిన కోరికేమంటే- "జర్మనీ దేశంలోని సంస్కృతపండితులను ప్రధానంగా చూడాలని నేను కాంక్షిస్తూ ఉన్నానని, మహిళా సంఘాలకు వెళ్ళాలనే గాఢమైన కాంక్ష నాకు ఉన్నదనీ, జర్మనీదేశ సంస్కృతిని చక్కగా తెలిపే పెద్దలతో నాకుపరిచయం కల్గించవలసిదనీ నేను వారిని కోరాను. వారు ఎంతో ఆదరంతో ఆవిధంగా నా కార్యక్రమాన్ని రూపొందించి ఒక్క పూటలో దానికి తగిన ఏర్పాట్లన్నీ చేసేశారు.

అగస్టు 15 వ తేదీనాడు బెర్లిన్ నగరంలో జరుపబడిన భారత ప్రభుత్వ రజతోత్సవాలను కన్నులవిందుగా సందర్శించిన తరువాత ఆగస్టు 16 వ తేదీనుండే నా కార్యక్రమము నే నాశించిన విధంగా, సంస్కృతపండితుడైన ప్రొఫెసర్ రూబెన్ మహాశయుని సందర్శనంతో ప్రారంభమైనది.

శ్రీ రూబెన్ పండితుడు మహాకవి కాళిదాసు రచనలను అన్నింటిని ఆమూలచూడంగా అధ్యయనంచేసి, ఆ

# 5

మహాకవి కావ్యాలపై ఆధికారికమైన విమర్శనలనుచేసి, జర్మనీ భాషలో వేలపుటలుగల మహాగ్రంధాలను రచించిన మహామనీషి!

బెర్లిను మహానగరంలో ఒకమూల స్ప్రి 'నదీతీర ప్రాంతంలో ఉన్న రవీంద్రనాధ్‌టాగోర్ వీధిలో 25వ నెంబరు ఇంటిలో ఉన్నారు. ఆజానుబాహువై, ఉన్నతమైన విగ్రహ స్ఫూర్తితో, భారతీయఋషిసత్తముని జ్ఞప్తికిదెచ్చే ఆ మహానుభావుడు నాకారు వారి యింటిముందు ఆగేటప్పటికి రోడ్డు మీదికివచ్చి ఎంతో ఆదరభావం చూపారు. ఇంటిలోనికి వెళ్లినతర్వాత వారు నన్ను వేసిన మొదటి ప్రశ్న యిది. 'రాకెట్ గమనంతో, అతిత్వరగా సోషలిస్టు సమాజ స్థాపనోద్దేశంతో ముందుకు ముందుకు దూసుకొని పోతూ ఉన్న మా యువతరానికి, వేద నాగరికతను ఆదర్శంగా పెట్టుకొన్న మీ భారతదేశం, ఏమి సందేశ"మీయ్యాలనే ఉద్దేశంతో మిమ్మల్ని ఇక్కడకు పంపిదమ్మా? అని. నేను వారి సూటియైన ప్రశ్నకు జవాబు చెప్పడానికి కొంచెం ఆలోచించే యత్నంచేసేలోపుగానే వారందుకొని, 'నన్ను ముందు

కొంచెం చెప్పనీయండి. నేను మహాకవికాళిదాసు రచనల న్నింటినీ చక్కగా అధ్యయనం చేశాను. ఆమహాకవి సృష్టిం చిన పాత్రలన్నీ ఎంతో ఉత్కృష్టమైనవి. ఉదాహరణకు శకుంతలను తీసుకోండి. ఆమెతనకు విధివిహితమైన గాంధర్వ విధిలో దుష్యంత మహారాజును అరణ్యంలో, ఏకాంతంలో వివాహమాడింది. మహారాజైన దుష్యంతుడే దీనికి ప్రేర కుడు. అయినా ఆయన తన రాజ్యానికి వెళ్ళినతర్వాత ఆమె సంగతే ఎత్తుకొనలేదు. దుష్యంత సమాగమనంవలన శకుం తల గర్భవతియైనది. విషయం తెలుసుకొన్న తరువాత, తాత పొదుడైన కణ్వునిచే దుష్యంతునివద్దకు పంపబడింది. రాజు ఆమెను ఇతఃపూర్వము ఏమీ ఎరుగనట్లే నటించాడు. ఆ అవినయాన్ని, ఆ ధనమదాంధత్వాన్ని శకుంతల ఏ మాత్రము సహించలేదు. రాజును గడ్డిపోచవలె తిరస్క రించి, మారీచిముని ఆశ్రమానికి వెళ్ళి అక్కడ తన కుమా రుడైన భరతుని సర్వదమనునిగా తయారుచేసింది. అంతే కాదు ఆ మహారాజే మరల పశ్చాత్తప్తుడై తనన్ను స్వీకరించే టట్లుచేసింది. తనకుమారుని పేరిట, భవిష్యత్తులో యుగ యుగాలకు చెఱగని ప్రభావ ముద్రతో ముద్రితమై లోకా

లకు శాంతి, ధర్మాలను ప్రసాదించే ఒక మహాదేశం పెంపొంది విరాజిల్లడానికి తగినవిధంగా తనకుమారుని సర్వవీరుణ్ణిగా తీర్చిదిద్దింది.

అట్లాగే భారతీయ సాహిత్యంలోని సీతాసాధ్వి, ద్రౌపది మున్నగు స్త్రీలందరూ స్వార్థ త్యాగంతో, లోక హితాన్ని సాధించిన మహిళామణులు. ఇది మీ భారతీయ సంస్కృతియందలి పరమోదారరామణీయకత. మా పాశ్చాత్య వాఙ్మయంలో ఇట్లాంటి త్యాగసౌందర్యం కనబడదు. స్వార్థభోగవిలాసయుతమైన మాయువతరానికి నేను ఈవిధంగా మీ భారతీయసంస్కృతినిగూర్చి తెలుపుతూ నాకుతోచిన సాహిత్యసేవచేస్తూ ఉన్నాను" అని రెండు గంటలు మన భారతీయ సాహిత్యంపై ఎంతో ఉన్నత భావంతో ప్రసంగించారు. వారి ప్రసంగంవింటూ ఉన్నంత సేపూ నేను ఏలోకంలో ఉన్నానో మరచిపోయాను. పాశ్చాత్య దేశాలలో అడుగుపెట్టగానే మన భారతీయ సంస్కృతిని గూర్చి యింత ఉన్నతమైన ప్రశంస వినడంతో నాకు

ఒళ్లు గరిపొడిచిపోయింది. ఆయనకు ఎన్నో జోత లర్పించి నేను బసకు తిరిగివచ్చాను.

తరువాత సంస్కృత వాఙ్మయ మందలి చారిత్రిక పరిశోధనచేస్తూఉన్న శ్రీమతి రిచెల్ పండితురాలిని చూచాను. ఆమె శ్రీ రూబెన్ పండితుని శిష్యురాలు, 15ఏండ్లు సంస్కృత పాళీభాషలలో అధ్యయనంచేసింది. ప్రపంచంలో కల్లా తలమానకమనదగిన ఉత్తమ చరిత్ర, సంస్కృతి హిందూదేశమందు విలసిల్లియున్నదని ఆ విషయమై పరిశోధన మొదలుపెట్టింది. ఆమెకు రామాయణ భారతాలపై ఎంతో గొప్ప అభిప్రాయం ఉన్నది.

'వేదకాలాలకంటే ముందుగానే భారతీయ చరిత్ర సంస్కృతులు ప్రారంభమైనవని వేదకాలం భారతజాతి యొక్క మహోజ్జ్వలమైన ఉచ్చస్థితికి నిదర్శనమనీ, ప్రపంచములో ఇంకేదేశము అంతగొప్ప సంస్కృతి కల్గినది లేదనీ ఆమె ఉద్దేశం.

తర్వాత ప్రసిద్ధరచయిత్రియైన రూద్ క్రాప్టును, బెర్లిన్ యూనివర్శిటీలో ప్రస్తుతం ఓరియంటల్ డిపార్టు మెంటులో ప్రొఫెసరైన శ్రీ హూబర్ పండితుని నేను కలుసు కొన్నాను. జర్మనీభాషపై వారి కెంత గౌరవప్రపత్తులున్నవో సంస్కృతభాషపై, మన భారతరామాయణములపై వారి కంత గొప్ప గౌరవభావం ఉండడం చూచినపుడు నాకెంతో సంతోషం కల్గడమేకాదు – ఎంతో ఆశ్చర్యంకూడా కల్గింది. అంతేకాక తనధార్మిక సంస్కృతిచే విశ్వానికే పూజ్యభావంతో ఆదరణీయమైన స్థానాన్ని సంపాదించిన మన సంస్కృత భాషయెడల నా కెంతో పూజ్యభావం కల్గింది.

ప్రొఫెసర్ హూబర్‌పండితులు భారతరామాయణాది ప్రధానగ్రంథాలెన్నో అనేకపాశ్చాత్య భాషలలోనికి అనువ దింపబడ్డాయని ఎంతో గౌరవభావంతో చెప్పారు.

అంతేకాక ఎంతోమంది జర్మనులు సంస్కృతం, బెంగాలీ, హిందీ, తమిళభాషలలో పరిశోధనలుకూడా చేస్తూ ఉన్నారు. ఈ పై భాషలలోని ఉత్తమగ్రంథాలెన్నో జర్మను

భాషలోనికి అనువదింపబడినాయికూడా. భారతీయసాహిత్యం అంటే ఆదరంలేని భారతీయు లీ విషయాలు తెలుసుకోవడం ఎంతో అవసరం.

తర్వాత, మేము హాలె నగరంలో నివసిస్తూ ఉన్న ప్రొఫెసర్ మోడేగారిని చూడటానికి హాలే వెళ్లాము. శ్రీ మోడే పండితుడు ఒక గొప్ప విశ్వసాహిత్యవేత్త. విశేషించి భారతీయ తత్త్వశాస్త్రాభిమాని. వారి ఇంట్లో గొప్ప గ్రంథాలయం! ఆ గ్రంథాలయంలో అన్నీ భారతీయగ్రంథాలే! భారతీయ శిల్ప చిత్ర, నాట్య, సంగీత సాహిత్యాది వివిధకళలపై ఎన్నో గ్రంథాలు వారిదగ్గర ఉన్నాయి. వేదవేదాంగములు మన శాస్త్రపురాణేతిహాసములు బౌద్ధవాఙ్మయము లెక్కలేనన్ని సంపుటాలు ఆ మహాపండితుని మందిరగ్రంథాలయంలో స్థానం కల్పించుకొన్నాయి. రవీంద్రుని వ్రాతప్రతులను మేక్స్‌ముల్లర్ వ్రాతప్రతులను ఎంతో గౌరవంతో ఆయన భద్రపరచుకొన్నారు. భారతదేశంలో వివిధ దేశభాషాసాహిత్యముల తీరుతెన్నులు ఆయనకు తెలిసినంత మనకు తెలియదేమో! ఆశ్చర్యమేమంటే: మన తెలుగు సాహిత్యాన్ని

గూర్చి ఆయన సేకరించినన్ని ఆంగ్ల వ్యాసములు మనం సేక రించలేము. కొన్ని పత్రికల పేర్లుకూడా మనకు తెలియువంటే అత్యుక్తి లేదు. ఆయన తనపేరును "మోద" అనిన్నీ, తన నగరాన్ని 'శాల' అనిన్నీ పిలవమన్నారు.

ఇంకా అద్భుతమైన విషయ మేమంటే ఆయన గృహ ముఖద్వారంపై గజలక్ష్మిచిత్రం ఉండడం. శ్రీ మోదమహా శయులు ప్రత్యేకించి మా కా విశేషాన్నిచూపి ఎంతో ఆనం దంతో, సంతృప్తభావంతో మాతో అభిభాషించినపుడు, నాకు పట్టశక్యం కానంత ఆనందపారవశ్యం కల్గడమే కాదు: మన పూర్వఋషులను తలపించే ఆకారగౌరవప్రపత్తులుకల ఆ మహానుభావుణ్ణి చూస్తూఉంటే ఎనలేని భక్తిభావం కల్గింది. ఓహో! ఈ మహాపండితునిచే ప్రస్తుతింపబడినంత విశ్వజన స్తుత్యమైన భారతీయ సంస్కృతికి చెందినదానను! కదా; నేను! అనే భావం నాలో తళుక్కున మెరసి నాకు ఎంతో గర్వంకూడా కల్గింది.

ప్రొఫెసర్ మోద మహాశయునితోడి పరిచయం నాకు

జీవితసార్థక్యాన్ని చేకూర్చే ఒక మహావరప్రసాదం! నాపర్యటనయొక్క ప్రయోజనసారం -; మోద మహాశయుని దర్శనం అంటే అతిశయోక్తి కాదు.

తర్వాత 'స్ప్రి' నదిలో బెర్లిన్‌నగరాన్ని చుట్టి రావడానికి నౌకా విహారం బయలుదేరాము. ఆ నౌకలో సరిగ్గా మా ఆసనాలకు ఎదురు ఆసనంపై హంగరీలోని, బుడాపెస్టు యూనివర్సిటీలో ఓరియంటల్ డిపార్టుమెంటులో పనిచేస్తూ ఉన్న డా॥ క్లారా అనేవారు కూర్చొని ఉన్నారు. వారితో ప్రసంగించే భాగ్యం మాకు కల్గడం చాలా భాగ్యమనుకోవాలి. ఆయన మన భారతీయవేద పురాణేతిహాసాలపై పరిశోధన చేస్తూ ఉన్న మహానుభావుడు. ఆయనకు భారతీయసాహిత్యంపై భగవద్గీతపైగల గౌరవాదరాలు వర్ణింపశక్యంకానివి. ఆయన తండ్రిగారికికూడా భారతీయతత్త్వశాస్త్రంపై ఎంతో గౌరవం. చిత్రమేమంటే ఆయన తండ్రి తన భార్యపేరు "రత్న"అని మార్చేసుకున్నారు. డా॥ క్లారా తనభార్యపేరును "పద్మ"అని మార్చుకున్నారు. అంతతో పూరుకోక శ్రీ క్లారా తనకుమార్తెకు 'అమృత' అని పేరుపెట్టారు. ఆయనతోడి

సంభాషణలో పాశ్చాత్యదేశాలలో భారతీయతత్త్వశాస్త్రంపై, సాహిత్యంపై భారత, భాగవత, రామాయణ, భగవద్గీతలపై గల అపారమైన పూజ్య భావాన్ని తెలుసుకో గల్గినపుడు నేను ఆనంద సాగరంలో మున్కలు వేశాను.

తర్వాత చెకొస్లొవేకియాలో ఎన్నో గ్రంథాలయాలను, ఎన్నో మ్యూజియమ్‌లను చూచాము. ఎన్నో ఓరియంటల్ డిపార్టుమెంటులను కూడా చూచాము. ఎక్కడకు వెళ్ళినా ముఖ్యంగా భారత, భాగవత, రామాయణ, భగవద్గీతల అనువాదగ్రంథాలు కొల్లలుగా ఉండడం చూచి విస్తుపోయాను.

చెక్ దేశంలోని ఒక మహాకవి చెక్ పిల్లలకోసం 'రామః, సీతా' అనే గ్రంథాన్ని చెక్ భాషలో వ్రాశాడు.

ఐరోపియా దేశాల విశ్వవిద్యాలయా లన్నింటిలోనూ అతిప్రాచీనమైన ప్రాహా విశ్వవిద్యాలయంలోని ఓరియంటల్ డిపార్టుమెంటు చూడటానికి వెళ్ళాము. అక్కడ 25-30 మంది విద్యార్థినీ విద్యార్థులు హిందీ, సంస్కృత భాషలలో

అధ్యయనం చేస్తూఉన్నారు. ఆ డిపార్టుమెంటు డైరెక్టరైన మిస్టర్ క్రిసా పండితుడు 'లుక్కింగ్ టువార్డ్స్ ఇండియా' అనే గ్రంథాన్ని వ్రాశాడు. అందులోని మొదటి పేరాలో భారతీయ తత్త్వశాస్త్రం, సమ్యగ్విజ్ఞానము, ఆధ్యాత్మిక చింతన, భగవద్విశ్వాసము మొదలైన మహావిషయములచే తక్కిన ప్రపంచ దేశస్థులంతా ఎట్లా ఆకర్షితులైనది, భారతీయసంస్కృతి ఎంతగా విశ్వశ్రేయస్కరమైనదీ వివరించి చెప్పారు. భగవద్గీతకు 6, 7 వ్యాఖ్యానాలు వారి భాషలో వెల్వడినట్లు చెప్పారు. భారతీయయోగాసన వివరాలు తెల్పే గ్రంథాలకు అక్కడ హెచ్చు విలువ ఉన్నది.

తర్వాత బ్రటిస్లావా నగరం చేరి, అక్కడ నుండి రష్యాదేశం వెళ్లాము. రష్యాలో మిక్కిలి సుందరమైన మాస్కో మా మొదటి మకాం. మాస్కో మహానగరంలోని రైటర్స్ యూనియన్‌లో విదేశశాఖ ప్రతినిధియైన మిస్ మిరియమ్ సల్గానికా చాలా ప్రతిభావంతురాలైన, చాలా ప్రముఖురాలైన వ్యక్తి. ఆమెకు హిందీ బాగా వచ్చును. ఆమె నన్ను ప్రథమంగా చూడటానికి వచ్చినపుడు ఆమెకు నేను ఇంగ్లీషు

వ్యాఖ్యతో ఉన్న ఒక పాకెట్ భగవద్గీత ఇచ్చాను. ఆమె యెంతో ఆదరంతో వంగి రెండుచేతులూ అంజలించి సవిన యంగా భగవద్గీత తీసుకొన్నారు. నేను ఆశ్చర్యంతో విభ్రాం తురాలనైనాను. 'ఈ కమ్యూనిష్టు దేశంలో మా భగవద్గీత కింత గౌరవ మేమిటి?' అని నేనామె నడిగాను. ఆమె వెంటనే "ఏమీ! మీ భగవద్గీత ప్రపంచానికే సందేశ మిచ్చే ఉత్తమ గ్రంథం కదా. మా దేశానికి మాత్రం, సందేశ మీయలేదా?" అన్నారు.

"అబ్బే, నేనట్లా అభిప్రాయపడడంలేదు, భగవద్విశ్వా సం లేని మీ కమ్యూనిష్టు దేశానికీ, భగవంతుని గీత ఏమి సందేశం ఇస్తుందని మీ విశ్వాసం?, "అని నే నడిగాను," భగ వానునియెడ మా విశ్వాసాలు కర్మపరంగా చాలా పవి త్రంగా ఉన్నాయి. మాకా విశ్వాసం లేదని మేము చెప్పలేము. ముఖ్యంగా భగవద్గీతలోని కర్మయొక్క పవిత్రతను, విధి నిర్వహణము నందలి కర్తవ్యమును, సమతాధర్మముయొక్క ప్రాధాన్యమును, ఆత్మవిశ్వాసముయొక్క ప్రాముఖ్యమును మహోన్నతంగా, శిరోధార్యమైన సందేశంగా మేము భగవ

ద్గీత నుండి స్వీకరిస్తాము." అని ఆమె ఎంతో సంతోషంతో చెప్తూవుంటే నేను నా చెవులను నమ్మలేని పరిస్థితిలో 'ఆ, ఆ' అంటూ నిరుత్తరురాలనై నిల్చుండి పోయాను.

రష్యాలోని టాల్స్టాయ్ మహాకవీశ్వరుని మందిరానికి వెళ్ళినపుడు ఆ మందిరంలో ఉన్న ఈశ (ఏసు) ప్రార్థనా మందిరాన్ని చూచినపుడు, ఆతనికి భారతీయతత్త్వశాస్త్రంపై గల ప్రగాఢగౌరవభావాన్ని ప్రస్ఫుటంచేసే చిహ్నాలను ఆ మందిరంలో చూచినపుడూ నేను ముగ్ధురాలనై పోయాను.

తరువాత రష్యాలోని లిథువేనియా రాష్ట్రానికి వెళ్ళాము. లిథువేనియా రాష్ట్రంయొక్క రాజధానీ నగరమైన విల్నూస్ నగరంలోని విభిన్నమతాలకు చెందిన చర్చ్లను చూచి ఆశ్చర్యంతో మా ఇంటర్ప్రటర్ విక్టర్ను 'మీ క్రీస్తుమతంలో కూడా భేదాలున్నాయా'? అని అడిగాను. వెంటనే ఆయన "ఎందుకు లేవు? మా మతంలో 246 భేదాలున్నాయి" అని చెప్పగానే నాలోని ఒకభావధార అమాంతం పైకిపెల్లుబికింది. మరి మీకిన్ని భేదాలుంటే మా హిందూమతాన్ని

మీరెందుకు విమర్శిస్తారు?' అని నేను తిరిగి ప్రశ్నించాను. "నిజమే. అది అవివేకమే" అని ఆయన అన్నపుడు ఆయన యెడల నాకేంతో సద్భావం గల్గింది. నిజానికి భగవంతు డొక్కడే అయినా మన అవివేకం వలన ఈ మతభేదాలు కల్గించుకొని మనం బాధ పడ్తూ ఉన్నాము. అప్పుడు నేను 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అనే ఉపనిషద్వాక్యాన్ని ఉదహరించి హిందూమతంలోని పవిత్రమైన ఏకేశ్వరభావాన్ని గూర్చి చెప్పగా విని ఆయన ఎంతో సంతోషించారు.

విల్నూస్ నగరవాస్తవ్యులైన సర్ ఎడ్వర్ దాస్ అనే లిథువేనియా మహాకవిని సందర్శించటానికి మేము వెళ్లాము. అయన మన జవహర్లాల్ ఎవార్డు గ్రహీత. ఆయన లిథువేనియా భాషలో 'మాయ్ నో రాము,' 'మాయినో ఇండిష్క' అనే కావ్యాన్ని వ్రాసిన మహాకవి. నేను సంస్కృతకవయిత్రి నని తెలుసుకొని నాకు బెల్ట్ ఆఫ్ హొయిట్స్ అని వ్యవహరింపబడే ఒక బెల్టును బహూకరించి 'మా దేశానికి వచ్చిన సంస్కృత రచయిత్రిని ఈ మాత్రమైనా సత్కరించకలేకపోతే అది మా దేశానికే తలవంపు' అని అన్నారు.

అక్కడే విల్నూస్ విశ్వవిద్యాలయంలోని ఇండాలజీ ప్రొఫెసర్ మీరోనస్ దగ్గరకు వెళ్ళాము. ఆయనకు సంస్కృతం, హిందీ వచ్చును. ఆ భాషలను అక్కడ కొందరికి స్త్రీలకు ఆయన నేర్పుతూ ఉన్నారు. వారికి భారతీయసాహిత్యం అంటే ప్రగాఢమైన అభిమానం. వారంతా మన సాహిత్యాన్ని గూర్చి అడిగితెలుసుకొని ఎంతో ఆనందించారు. నేను సంస్కృతకవయిత్రి నని తెలుసుకొని ప్రొఫెసర్ మీరోనస్ లేచి వినమ్రంగా నమస్కరించారు.

ఐరోపా దేశాలలోని, చెక్, స్లావ్భాషలు సంస్కృతానికి చాలా దగ్గరగా ఉంటాయి. అంతకంటే లిథువేనియా భాష సంస్కృతానికి చాలా సన్నిహితంగా ఉంటుంది. ఈశ్వరుని నిజతత్త్వాన్ని చెప్పే ఉపనిషత్తులు గల సంస్కృత భాషకు మా భాష దగ్గరగా ఉండడం మా అదృష్టమని వారు అంటూంటే, నేను మన దేవభాషకు ఎన్నో జోత లర్పించాను. రష్యా ఎంత కమ్యూనిస్టు దేశమైనా, ఎన్నో చర్చిలను మ్యూజియమ్‌లుగా మార్చివేస్తూ ఉన్నా, ఆర్డరులో ఉన్న చర్చిలింకా చాలా గ్రామసీమల్లో ఉన్నాయి. విల్నూస్, కౌనస్ పట్టణాల్లో

అట్లాంటి చర్చలను ఎన్నో చూడగలిగినందుకు నాకు సంతోషం కల్గింది.

ఈ విషయా లన్నింటికంటె ముఖ్యంగా చెప్పవలసింది బెర్లినులో ఉన్న బెర్లిన్ మహిళాసంస్థవారికి నాకూ జరిగిన చర్చ! అనేక విషయాలనుగూర్చి వారూ నేనూ మాట్లాడుకొన్న తర్వాత, నా ఇంటర్ప్రెటర్ మిస్ ఖ్యాల్ 'మీకు వివాహానికి ముందు డేటింగ్ ఉంటుందా' అని అడిగింది. 'ఉండదు' అని నేను చెప్పగానే ఆమె చాలా ఆశ్చర్యంగా 'అయితే ఒకరి తత్త్వం ఒకరు తెలుసుకోకుండా మీరు పెండ్లి చేసుకుంటే మీలో మీరు భార్యాభర్తలు, ఎట్లా సమైక్యంగా ఉండగలరు?' అని అడిగింది. నేను వెంటనే అందుకొని 'నిజమే డేటింగ్ లేకుండా వివాహాలు చేసుకొనే మేము భార్యాభర్తలం మాలో మేము సర్దుబాటు లేకుండా జీవితం గడపవచ్చును, కానీ డేటింగ్ సౌకర్యం కల్గిన మీరు ఒకరి నొకరు అర్థంచేసుకన్న తర్వాత పెండ్లిండ్లు చేసుకొని కూడా మరలా వెంటనే విడాకు లిచ్చుకోడం ఎట్లా తటస్థిస్తున్నది? మరి మీ డేటింగ్‌కి ఇంక ఫలిత మేమిటి? అని నే నడుగగానే ఆమె నిజంగ్రహించి, 'ఔను

నిజమే, మీ పద్ధతిలో చెడు గేమీ లేదు. మీరు చెప్పింది నిజం' అని నన్ను మెచ్చుకొన్నది.

తర్వాత, నేను కెనడాలో ఉద్యోగంచేస్తూఉన్న, చి.మా అబ్బాయి రాజరాజనరేంద్రుని దగ్గరకు వెళ్ళాలని, మాస్కో నుండి మాంట్రియల్‌కు వెళ్లాను. దీనితో భారతప్రభుత్వం వారి సాంస్కృతిక పర్యటన కార్యక్రమం ముగిసి, నా స్వంత పర్యటనం ప్రారంభమైన దనవచ్చును.

కెనడా, అమెరికాలు మనవలె భగవద్విశ్వాసంకల దేశాలు, కెనడాలోని ప్రసిద్ధరచయిత్రులందరూ సంపూర్ణ మైన భగవద్విశ్వాసం కలవాళ్లు. అంతేకాదు, "భగవద్విషయ మేదైనా ప్రస్తావించడానికి కూడా మనకు యోగ్యత లేదు. కాబట్టి ఆవిషయంలో మౌనమే సర్వోత్తమ,"మనే కవయిత్రులు కూడా అక్కడ వున్నారు.

మాంట్రియల్‌లో హరేకృష్ణ, హరేరామ భక్తిధర్మానికి చెందిన కృష్ణచైతన్య మందిరాన్ని, కెనడా వాసులైన అక్కడి భక్తుల భక్తిపారవశ్యాన్ని చూచినప్పుడు, మన భారతదేశంలో

విదేశీయమతధర్మాలంబ ప్రభావవశమున అంతకంతకు తరిగి పోతూ వున్న మన హిందువుల భక్తి నా తలంపునకు పారి మన దుస్థితిపై నా కెంతో బాధ కల్గింది.

నా కుమారుడు నివసిస్తూ వున్న విండ్సర్‌కు వెళ్ళిన తరువాత నా కుమారుడు నన్ను భగవద్గీతలో ఏదైనా కొంత భాగం పాఠప్రవచనంగా చెప్పమని కోరాడు, భక్తియోగాన్ని 5-6 దినాలు ప్రవచనం చేసే భాగ్యం నాకు కల్గింది. అది వినడానికి విండ్సర్ యూనివర్సిటీ యందలి గ్రంథాలయ విభాగానికి చెందిన శ్రీ ఫ్రెడరిక్ స్టాక్ దంపతులు వచ్చారు. వారు, నేను భగవద్గీతభక్తియోగానికి చేసిన-మానవుని సచ్చేష్టయే భక్తి-అనే వ్యాఖ్య విని చాలా సంతోషించారు.

ఆ మర్నాడు మమ్ము యూనివర్సిటీకి ఆహ్వానం చేశారు. అక్కడ జరిగిన చర్చలో భగవద్గీత సర్వోత్కృష్టమైన ఉప దేశ గ్రంథమనీ, హిందువులను క్రిస్టియన్ మతానికి మార్చుట చాలా అక్రమమనీ, చర్చి సర్వీసులో ఒక పాతికేండ్లు గడపిన శ్రీ ఫెడరిక్‌స్టాక్ అంగీకరించడం చాలా ముదావహం.

దానిపై నేను "మీ క్రిస్టియానిటీలో 240 భేదాలున్నాయని రష్యాలో చెప్పారు. నిజమేనా?" అని అడిగాను. '240 భేదాలేమిటి? 460 భేదా లున్నాయ'న్నారు.

ప్రపంచంలోని సర్వమతాలలోనూ భేదాభిప్రాయా లుండడం అతిసహజమని తెలుసుకొన్న పిదప నా మనస్సు కొంత ఊరడిల్లింది. భేదాలనేవి మానవకల్పన. మన హిందూధర్మం, ప్రపంచంలోని అన్ని మతాల కంటే అతి ప్రాచీనమైనది కావడం చేత ఈ సనాతనధర్మంలో అనేక భేద, విశ్వాసాలు భగవద్విషయంగా ఏర్పడడ మనేది సహజం.

అయినా భగవంతుడు డొక్కడే అనే భావన హిందూ ధర్మానికి క్రొత్తదికాదు. అట్టి భగవద్విశ్వాసం కలవాళ్ళు హిందూ ధర్మంలో లేకపోనూలేదు. తమ కేమీ తెలియక పోయినా, తమ ధర్మంలో 460 భేదాలున్నా, హిందూ ధర్మాన్ని హేళన చేసే అజ్ఞానుల కుతర్కానికి యిది సరియైన జవాబు అనే సంతృప్తి నా కా నిముషంలో కలిగి, నా పర్యటన మరొక్కమారు సార్థక మైన దని నేను మరీ మరీ సంతోషించాను.

ఈ సంఘటన జరిగిన కొద్ది రోజులలోనే నేను అమెరికాలో న్యూయార్కు వెళ్ళి స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ చూడడానికి సముద్రంపై నౌకా ప్రయాణం చేస్తూ వుండగా ఒక పాతికేళ్ళ స్పెయిన్ యువకుడు నా చీరెకట్టు చూచి "ఆర్ యు కమింగ్ ఫ్రం ఇండియా" అని అడిగి నన్ను సమీపించాడు. ఆ యువకుని జేబులో భగవద్గీత, చేతిలో హిందూదేశపు భక్తి గీతాలు ఆలాపించే ట్రాన్సిస్టర్.

నా పర్యటన అంతా ఇటువంటి అనుభవాలతోనే నిండివుండడం చేత ఆ సంఘటనకు నేనంత ఆశ్చర్యపడలేదు. కానీ ఆ యువకుని భావాలు మాత్రం నన్నెంతో ఆకర్షించడమే కాక ఆశ్చర్యచకితురాలి నొనర్చాయి.

'భగవద్గీతపై మీ అభిప్రాయం ఏమిటి'? అని ఆ స్పెయిన్ యువకుడు నన్ను ప్రశ్నించాడు. "నేను నా అభిప్రాయం చెప్పే ముందు భగవద్గీతపై మీ అభిప్రాయం ఏమిటో తెలుపగలరా?" అని నేను ఆ యువకుని ఎదురు ప్రశ్నించాను. "అది విశ్వమానవాళికి సందేశం ఇవ్వగల

ఉత్తమ గ్రంథం. మానవులకు భగవదనుభవం కల్గించ డానికి, వారిని పాపవిముక్తులను చెయ్యడానికి, సత్కర్మదీక్షితులను చెయ్యడానికి, మార్గాలను చూపే ఏకైకగ్రంథం ప్రపంచంలో అదొక్కటే:" అని ఆ యువకుడు తడుముకోకుండా జవాబు చెప్పాడు. నేను అంతతో వూరుకోక "మీ బైబిలుకూడా చాలా గొప్ప గ్రంథమే కదా, దానిని ఆశ్రయించి శరణాగతి పొందినవారు ఎందరో ఉన్నారు. అట్టి బైబిలు కంటే భగవద్గీత గొప్పదని మీ ఉద్దేశమా?" అని నేను తిరిగి ఆ యువకుని ప్రశ్నించాను. "భగవద్గీతతో బైబిలును సమానంగా మీరు హిందువులై వుండి ఎట్లా పోలుస్తూ ఉన్నారో నాకు సందేహంగా వుంది. బైబిలులో ఏమున్నది? అది కేవలం Shallow మాత్రమే. బైబిలులో కొందరు భక్తుల కథలు వుండవచ్చు. కొన్ని ప్రాథమికనీతిసూత్రాలుండ వచ్చును. కాని భగవద్గీతలోని గంభీరత, సకలధర్మసార తాశ్రేష్ఠత్వము. మానవుని సత్కర్మాచరణకు, నిష్కామ కర్మకు ప్రేరితునిగచేసే ఉత్తమమార్గాలు బైబిలులో ఎక్కడ వున్నవి? ఏ వయస్సులో వారికైనా, ఏపరిస్థితిలో వారికైనా ఏమానసిక తత్త్వం కలవారికైనా, ఏ మార్గంలో కావలసివస్తే

ఆ మార్గంలో ఎట్టిపాపాత్మునకైనా తరుణోపాయం చూపడా నికి భగవంతునిచే మానవప్రపంచానికి ప్రసాదించబడిన ఏకైక శరణ్యం భగవద్గీత ఒక్కటి మాత్రమే. అది విశ్వపం దేశ జ్యోతి, ధర్మదీపిక," అని ఆ యువకు డుత్తేజితస్వరంతో భగవద్గీతను గూర్చి తన మహోదాత్త భావాలను వెలిబు చ్చాడు. ఈ విషయాలు చెప్తూ వున్నంతసేపూ ఆ యువకుని ముఖం ఎంతో గంభీరంగానూ మహోజ్జ్వలంగానూ ప్రకాశిం చింది. 'అమెరికా అంత దూరదేశంలో వుండి మీ ట్రాన్సి స్టరులో హిందూదేశ భక్తిసంగీతం ఎట్లా వింటూవున్నారు?' అని నేను ప్రశ్నించాను. మిక్కిలి శక్తివంతమైన సాధనాలను ఇందులో అమర్చి మేము ఈ భారతీయభక్తిసంగీతం వింటూ వుంటామని ఆ యువకుడు సంతోషంతో చెప్పాడు. అసలు విషయ మేమిటంటే రాధాస్వామిమతానుయాయులైన 2000 మంది స్పెయినుదేశస్థులు ఆగ్రాలోని రాధాస్వామి ఆశ్రమానికి వెళ్లడానికి నిర్ణయించుకొని న్యూయార్క్ వచ్చారట. వారంద దరూ నిత్యమూ భగవద్గీతా పారాయణం చేస్తారట. రాధా స్వామి మతానుయాయులైన, వారందరూ గొప్ప ఈశ్వర భక్తులు!

ఇది జరిగిన మరునాడు నేను న్యూయార్క్ నందలి కృష్ణ చైతన్య మందిరానికి వెళ్లాను. అక్కడ ఆనాడు భాగవతమునందలి గోవర్ధన పర్వతోద్ధరణఘట్టం పఠింపబడుతూ వున్నది. పాశ్చాత్యదేశాల యందలి కృష్ణ చైతన్య మందిరాలలో వుండేవారంతా గొప్ప గొప్ప విజ్ఞానశాస్త్రవేత్తలు, డాక్టర్లు, ప్రిన్సిపాల్స్, గొప్పగొప్ప న్యాయవాదులూ. ఉద్యోగస్థులూను! వారంతా తమ ఉద్యోగాలకు రాజీనామా లిచ్చి ఈ కృష్ణమందిరాలలో వుంటూ ఆధ్యాత్మిక చింతతో కాలక్షేపం చేస్తూ వున్నారు. వారిలో ఎవరూ మద్యంముట్టుకోరు. అందరూ ఏకపత్నీవ్రతులు. అందరూ శిఖాయజ్ఞోపవీతధారులు! మహిళలంతా హిందూ పద్ధతిలో చీరెలు కట్టుకొని సిగలను అలంకరించుకొన్నవారే. చిన్నపిల్లలతో వారు ఆ మందిరాలలో నివసిస్తూ భగవత్సేవలో జీవితాన్ని ధన్యం చేసుకొంటూ వున్నారు. ఆబాల గోపాలం మూడుపూటలా శీతోదకాలతో స్నానాలాచరించి చైతన్య సాంప్రదాయకంగా తిలకధారణంచేసి, కాషిబట్టలు కట్టుకొని, ఉదయం గోపూజా, సాయంకాలం తులసిపూజా చేస్తూ ప్రసాదస్వీకారం చేస్తూ సంధ్యలలో పూజాదికాన్ని నిర్వర్తిస్తూ భక్తి పారవశ్యంతో

భువనమోహనంగా నాట్యంచేస్తూ వుంటే స్వర్గం భూమిమీదికి కవతరించిం దనుకోవలసిందే కాని, మరొకటి కానేకాదు, మన పురాణగాథల నెన్నింటినో వారు సుందరంగా చిత్రించారు. చైతన్య భక్తిసాంప్రదాయంతో తమ జీవిత ధ్యేయాన్ని సంతతమూ అన్వేషించుకొంటూ వున్న ఆ సాధకలోకాన్ని, ఆ భక్తమండలిని చూస్తూ వున్నకొలదీ నేను దివ్యానుభవంతో పరవశించి పోయాను. ఆవేళ నేను న్యూయార్క్ కృష్ణ మందిరంలో పొందిన యింకొక అనుభవం నన్ను మరింత ఆకర్షించింది. గోవర్ధనోద్ధరణ ఘట్టం పఠించడం ముగిసిన తర్వాత నా ప్రక్కనే ఆసీనురాలైన ఒక పాశ్చాత్య యువతిని చూచి నేను "మీరు ఈ కృష్ణభక్తికి ప్రప్రథమంగా ఎట్లా ఆకర్షితులైనారు? అని అడిగాను. ఆమె ప్రత్యుత్తరం వింటే ఎవరైనా ఆశ్చర్యపడిపోతారు. ఆమె తల్లిదండ్రులు హవాయి ద్వీపవాసులు! తండ్రి యింజనీరు! తల్లి డాక్టరు! ఒక రోజు వారి ఇంటిమీదుగా ఈ కృష్ణచైతన్య భక్తమండలి "హరేకృష్ణ, హరేరామ" నామమధురసంకీర్తనం చేసుకొంటూ వెళ్తాంటే ఎం.ఏ. చదువుతూ వున్న ఈ యువతి ఆ సంకీర్తన మాధుర్యానికి ఆకర్షితురాలై ఆ భజనమండలి ననుసరించి కృష్ణమంది

రానికి వెళ్ళింది. అక్కడ రాధాకృష్ణుల సుందర విగ్రహాలను, అక్కడి భారతీయధ్యాత్మికసాహిత్యగ్రంథాలను చూచి ముగ్ధురాలై, అక్కడి ప్రశాంతసుందరగంభీరవాతావర ణానికి ఆకర్షింపబడి క్రమక్రమంగా, ఆ ప్రదేశానికి, ఆ వాతా వరణానికి అలవాటుపడిపోయింది. ఇదీ ఆమె కథ! నేను మళ్ళీ ప్రశ్నించాను, "మీ అమ్మా నాన్నా దీని కంగీకరిం చారా? వారు కూడా, "హరేకృష్ణ అంటూ వున్నారా?" అని! "ఆ. మొదట్లో అంగీకరించలేదు. కాని వారినంగీకరింపజేసే ఒక మహత్తరసంఘటన జరిగింది. "ఒకమారు ఇంజనీరుగా వున్న మా తమ్మునకు న్యుమోనియావచ్చి యిక బ్రతకడనుకొ న్నారు. ఆ సమయంలో నేను మా గురువుగారి దగ్గర వున్న తులసితీర్థం తీసుకొని మా తమ్ముని నోటిలో పోశాను. వెంటనే కండ్లు తెరిచాడు, ఇప్పుడు హాయిగా ఉద్యోగం చేసుకొంటూ ఉన్నాడు. అది మొదలు మా అమ్మా నాన్నా కూడా 'హరేరామ హరేకృష్ణ' అంటూ ఉన్నారు. ఇప్పుడు ఆ ముదుసలులు నాకంటె ఎక్కువగా కృష్ణభక్తులై పోయినారు. అని మిక్కిలి ఉత్సాహంతో చెప్పిందా ఊర్వశి!

నాకు దిగ్భ్రాంతి కల్గింది. మెదడు ఆలోచించడం మానేసింది. నేను ఎక్కడ ఉన్నానో కొంతసేపటివరకూ నాకు తెలియలేదు. ఇది కలా! నిజమా? అనే సందేహంలో నుండి నేనింకా తేరుకోకముందే. ఆమె నన్ను తట్టి "ఏమీ మీరు హిందువులే! మీరు దీనిని నమ్మడంలేదా?" అని అడిగింది.

"అబ్బే, అదికాదు. నేను నమ్ముతూనే ఉన్నాను. కాని మాతోటి హిందువులు నమ్మక పోవచ్చును. అసలు నిజంగా ఆలోచించిచూస్తే కొన్నాళ్ళకు మీరు హిందువులుగామారి, మేము పాశ్చాత్యులుగా మారగలమేమో నని నేనుతలంచుతూ ఉన్నాను" అని నే ననేసరికి ఆమె నవ్వి, "మా కంత భాగ్యమా" అన్నది.

హంగరీ గిటార్ వాదకుడు గెబర్స్జబో అనే సంగీత శాస్త్రజ్ఞుడు రాగదత్త, రవి, కృష్ణ, గీత అనే పేర్లు పెట్టి కొన్ని గీతాలు హిందూఆధ్యాత్మికతత్త్వానుసారంగా వ్రాసి గిటార్ పై వాయించి ప్రదర్శనలిచ్చాడు.

మహేష్ యోగి శిష్యులూ, బీటిల్సుకు చెందిన వారూ అయిన, జార్జి హారిసన్, జాన్ లెనెస్ అనే గాయకులు హిందూ తత్త్వపరంగా పాటలు పాడ్తారు.

జాన్ హిగ్గిన్స్ భాగవతార్ ప్రపంచసంగీతశాస్త్ర సభలో పాల్గొని దక్షిణభారతానికి సంబంధించిన కర్ణాటక సంగీతం ప్రపంచసంగీతాలలో కల్లా అత్యుత్తమమైనదనీ దానికి కారణం! అది భక్తిపూర్వకం కావడమే ననీ నిరూపించారు.

ఇంకొక మహాద్భుతవిషయం ఏమంటే డేవిడ్ మిచెల్ టన్ తన రచనయైన "యాన్ ఇన్‌ట్రడక్షన్ టు స్టాటిస్టికల్ కమ్యూనికేషన్ థీరీ" అనే గ్రంథంలో" నష్టో మోహః స్మృతిర్లబ్ధా" అనే భగవద్గీతాశ్లోకాన్ని ఉదహరించి యున్నాడు. సుప్రసిద్ధ అణ్వాయుధ నిర్మాణ శాస్త్రజ్ఞుడు ఐవాన్ హోవర్ "బెటర్ దాన్ థౌజండ్ సన్స్" అనే తన గ్రంథంలో మొట్ట మొదటగా అణ్వాయుధం ప్రేలినప్పటి తేజస్సును చూస్తే భగవత్తేజం గుర్తునకువచ్చి "దివి సూర్యసహస్రస్య భవే ద్యుగ

III

పదుత్థితా, యది భాస్సదృశీ స్యాద్భాసస్తస్య మహాత్మనః"
అనే గీతాకారుని విశ్వరూప సమయమందలి, భగవానుని
అనంత తేజస్సునుగూర్చి ప్రస్తావించిన పై శ్లోకాన్ని,
"కాలో஽స్మి లోకక్షయకృ త్ప్రవృద్ధః" అనే శ్లోకాన్నీ
పేర్కొన్నారు.

ఇంకా అద్భుత మేమంటే, నిరీశ్వరవాద సంభరితమైన,
కమ్యూనిజానికి కేంద్రమైన రష్యాదేశంలో హరేకృష్ణ మందిర
ప్రతిష్ఠాపన జరుగబోతూ ఉన్నదని నేను న్యూయర్కు కృష్ణ
మందిరంలో వినడం!.

ఇట్టి పరమాద్భుతసంఘటనలతో పరమాద్భుతం
పొంది, నేను "భారతీయులు తాము ఈ సమర్థమైన
తత్త్వసంపదకు వారసులైనా ఈ పితీ్రయపు ఆస్తిని మూర్ఖులై
పోనాడుకుంటూ ఉన్నారే!

ఆహా! హిందువు లెంత అజ్ఞానంలో ఉన్నారు! ఎంత
ఆత్మవంచనకు లోనైనారు: ఎప్పటికి వీళ్ళకు సంపూర్ణమైన
హిందూధర్మజ్ఞానదర్శనం కలుగుతుంది? ఎన్నాళ్ళకు ఈ

హిందువులు మళ్ళీ "నష్టో మోహః స్మృతిర్లబ్ధా" అని గల్గుతారు? తన్మూలకంగా ఎన్నాళ్ళకు లోకంలో శాంతి కొల్పబడుతుంది? ఎన్నాళ్ళకు ఈ ధర్మావలంబనపరులతో కూడిన విశ్వంలో శాంతి ప్రతిష్ఠాపింపబడి, సంఘర్షణల పమసిపోయి, సర్వజనులు సుఖులు కాగల్గుతారు? చింతా పరంపరతోనూ, భగవానుడే అన్ని భయసందేహాలు పోగొట్టి భారతీయాధ్యాత్మిక జ్ఞానకాంతిని లోకాలోకాలలో ప్రసరింపజేసి చీకట్లను విరియింపజేస్తాడు" అనే విశ్వాస తోనూ నేను భారతదేశంలో కాలు పెట్టాను.